# ఆంధ్రపత్రిక

3173??





The Andhra Patrika, Madras. } Regd. No. M. 1118 Vol. 36 No. 13 WEDNESDAY 13th APRIL 1949 వెల ఒకఅణా { Founder: K. Nageswara Ra


# '1949 ప్రపంచ భవిష్యత్తును తేల్చివేసే గడ్డు సంవత్సరం'

## ఇటలీ పాత వలస రాజ్యాల భవిష్యత్తు

### తిరిగి ఇటలీకి వప్పగించడం వినా పరిష్కార మార్గంలేదనిసమితిసంఘసభ్యుల అభిప్రాయం

లేక్ సక్సెస్, ఏప్రిల్ 11: ఇటలీ పూర్వ వలస రాజ్యాలైన ట్రిపోలిటానా, సోమాలిలాండ్ ఎరిట్రియాలో కొంత భాగము తిరిగి ఇటలీకే వప్పగింతపెట్టడం వినా, వేరే పరిష్కారమార్గం లేదని, ఐక్య రాజ్య సమితి రాజకీయ సంఘంలో మొదటిరోజు చర్చ ధోరణినిబట్టి వ్యక్తమౌతున్నది. వీటిని తిరిగి ఇటలీకే వప్పగింత పెట్టవలెననే అంశంపై, ఒక్క సోవియట్ యూనియన్, రాజకీయ సంఘంలో మిగతా రాజ్యాలన్నీ సుముఖ భావం వెల్లడించినవి.

ట్రిపోలిటానాను, ఎరిట్రియాలో చాలా భాగమును ఇటలీకి వప్పగింతపెట్టుటకు 5 లాటిన్ అమెరికా రాజ్యాలు దక్షిణాఫ్రికా యూనియన్ అనుకూలత ప్రదర్శించినవి. సైరనీకా, తూర్పు లిబియాలపై బ్రిటిష్ పరిపాలనాధిపత్యం ఉండాలనే సూచనను గూడా రాజకీయ సంఘసభ్యులలో చాలామంది సమ్మతించారు. ఎరిట్రియా దక్షిణ ప్రాంతంగుండా, సముద్ర తీరమునకు వీధి యితియోపియా (అబిసీనియా)కు త్రోవయివ్వవలెనను సూచనకు గూడా రాజకీయ సంఘసభ్యులు సమ్మతించినట్లేనని చెప్పవచ్చు. ఈసూచనలకు అంగీకారం తెలుపని రాజ్యం యింతవరకు సోవియట్ రష్యాయే.

ఇటలీ పూర్వపు వలసరాజ్యాలన్నింటి పైనా 10 ఏండ్ల వరకూ, ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వపాలన నెరపవలెనని, అగ్ర రాజ్యాల ప్రతినిధులు, ఇటలీపై నిధులు, వలసరాజ్య ప్రజల ప్రతినిధులు, వీరితో ఒక సలహాసంఘము నేర్పాటు చేసి సమితి ధర్మకర్తృత్వ పరిపాలనలో యీ సలహా సంఘం తోడ్పడేటట్లు చూడవలెనని, కోరుచూ, పైసూచనలకు పూర్తిగా భిన్నమైన ప్రతిపాదనను రష్యా సూచించింది. అయితే యీ సూచనను, రాజకీయ సంఘ సభ్యులు బలపరచరని, మొదటిరోజు చర్చ ధోరణిని బట్టి తెలుస్తున్నవి.

ఇటాలియన్ వలసరాజ్యాల సమస్య పరిష్కారం విషయమై అరబ్ రాజ్యాలకు యింతవరకు సమాలోచించుట జరుగలేదు. కాని అరబ్ రాజ్యాల వైఖరి యిలా ఉండగలదని భావించవచ్చు. (1) సైరనీకాపై కొంతకాలం మాత్రమే బ్రిటిష్ పరిపాలనాధిపత్యం ఉండవలెను. (2) లిబియాలో యేప్రాంతంపై గూడా ఇటాలియన్ పరిపాలనాధికారం ఉండవ గూడదు. (3) ట్రిపోలిటానా, సైరనీకాలకు సమైక్యం చేయవలెనని, ఎరిట్రియాలో ముస్లిం ప్రాంతంపై ఇటలీ పరిపాలన ఉండకూడదని:

#### అబిసీనియా తీవ్ర ప్రాతికూల్యం

ఎరిట్రియా, సోమాలిలాండ్‌లను ఇటలీకి దత్తంచేసే తమ్ము మరియొకసారి చక్రబంధములో పడవేయవలదని, వీటిని ఇటలీకి వప్పగించడం, తమ్ము సింహంనోట్లో పడవేయుట తప్ప వేరేమీ కాదని, అబిసీనియా ప్రతినిధి అక్లికా సమితి రాజకీయ సంఘానికి విజ్ఞప్తి చేశాడు. అంతకు పూర్వం రాజకీయ సంఘంలో ఇటలీ ప్రతినిధి కౌంట్ కార్లో చేసిన ప్రసంగమునకు సమాధానమిస్తూ, ఎరిట్రియాలో నూటికి 90 మంది తిరిగి ఇటలీ పరిపాలన క్రిందకు పోవుటకు విముఖులని; పూర్వం ఎథియోపియా (అబిసీనియా)కు ఫాసిస్టు గవర్నర్‌గా వ్యవహరిస్తూ స్త్రీపురుషుల చిత్రవధను కర్లరామూచివ్యక్తి, యిప్పుడు ఇటాలియన్ ప్రతినిధివర్గం సభ్యుడుగా, యిక్కడకు రావడంతోచి ఆశ్చర్యచకితుడనైతినని అబిసీనియా ప్రతినిధి అన్నాడు.

## విదేశీయ పెట్టుబడితో పరిశ్రమలు

### ఇటీవల అనేక దరఖాస్తులు

[ 'ఆంధ్రపత్రిక' విలేఖరి ]

న్యూఢిల్లీ, ఏప్రిల్ 11: భారత దేశంలో పెట్టుబడి పెట్టి పరిశ్రమలు స్థాపించాలనే ఉద్దేశ్యంతో గత ఆరు మాసాలలో అనేకమంది విదేశీయ పారిశ్రామికవేత్తలు చాలా దరఖాస్తులు పంపుతున్నారు. ఈ దరఖాస్తులు ముఖ్యంగా రసాయనిక పదార్థాలు, రేడియోలు, బ్యాటరీలు మొదలైన పరికరాల ఉత్పత్తికి సంబంధించినవి. ఇవన్నీ ఐదు లక్షలకు తక్కువ పెట్టుబడితో స్థాపించడానికి వీలైన పరిశ్రమలు. విదేశీ పరిశ్రమల పెట్టుబడి విషయంలో భారతప్రధాని నెహ్రూ యిటీవల అసెంబ్లీ శాసనసభలో చేసిన ప్రకటన మంచి ఉత్సాహాన్ని కలిగించినది. కావలసిన ఏర్పాట్లను ప్రభుత్వము శీఘ్రముగా చేయ సంకల్పించినది.

## గడ్డు సంవత్సరం

### పశ్చిమ జర్మనీ ఆక్రమితోద్యోగుల సభలో మారిసన్ హెచ్చరిక

డీసెల్‌డర్ఫ్, ఏప్రిల్ 11: బ్రిటిష్ కౌన్సిల్ లార్డు ప్రెసిడెంట్ హెర్బర్టు మారిసన్ ఆక్రమిత జర్మనీలోని బర్గో మాస్టర్లు, ఉన్నత బ్రిటిష్ ఉద్యోగులు చేరిన ఒక సమావేశములో ఉపన్యసిస్తూ 1949 ఇటు జర్మనీభవిష్యత్తును, అటు ప్రపంచభవిష్యత్తునుకూడా తేల్చే గడ్డు సంవత్సరమని హెచ్చరిక చేశాడు. "పశ్చిమ యూరప్ ఆర్థిక సమీకరణకు, పునర్నిర్మాణానికీ కావలసిన ఒడంబడికలను పశ్చిమ ప్రజాస్వామిక రాజ్యాలు చేసుకున్నవి. ముఖ్యంగా పశ్చిమ జర్మనీలో యథాస్థితి స్థాపన కార్యక్రమ విజయంపైనే ఆధారపడి వుంటుంది" అనికూడా మారిసన్ అనెను. పశ్చిమరాజ్య సమాఖ్య ద్వారా పశ్చిమ యూరప్ ప్రజాభిమతం సుస్పష్టం కాగలదనికూడ చెప్పిరి.

### పశ్చిమ జర్మనీ ఏకీకరణ

వాషింగ్టన్, ఏప్రిలు 11: పశ్చిమ జర్మనీని ఏకీకరించుటకు అమెరికా బ్రిటన్ ఫ్రాన్సులు చేసుకున్న ఒడంబడిక యొక్క వివరములు నేడు వాషింగ్టన్‌లో అధికారరీత్యా ప్రకటింపబడెను. ఈ ఒడంబడికవలన ఆక్రమిత మండలములలోని ప్రస్తుత పరిపాలనావ్యవస్థలలో చెప్పదగిన మార్పు ఏమియు రాదు; ఎందుచేతనవగా, పరిపాలనా నిర్వహణకు 3 మండలములలోనూమూడు వేర్వేరువ్యవస్థలు ఇప్పటివలెనే ఇకముందు కూడా వ్యవహరించుచూ ఉండును. పరిపాలనా నిర్వహణకు పర్యవేక్షించుటకు మాత్రము, పైన ఒక అధిష్ఠానవర్గము ఏర్పాటు చేయబడును. క్రింద స్థలములలో 3 పక్షముల తరఫున పరిశీలకులు నియమింప బడుదురు.

జైనందిన పరిపాలనలో జర్మన్ ప్రభుత్వమునకు వీలైనంత కార్య స్వాతంత్ర్యం ఇచ్చి, పరిపాలనావ్యవస్థల్లోని సిబ్బందిని కనిష్ఠ ప్రమాణమునకు తగ్గించడం అవుతుంది.

## నైరృతి ఆఫ్రికా ఆదిమవాసుల విజ్ఞప్తికి అవకాశ నిరాకరణ

### అంతర్జాతీయ న్యాయస్థాన తీర్పును అర్థిస్తామని రెవరెండ్ స్కాట్ ప్రకటన

లండన్, ఏప్రిల్ 11: నైరుతి ఆఫ్రికా సమస్యను అంతర్జాతీయ న్యాయస్థానమునకు నివేదించుటకుగాను, కామన్వెల్తు రాజ్యాల తోడ్పాటుకోసం ప్రయత్నం జరుగుతున్నదని, రెవరెండ మైకెల్ స్కాట్స్ నేడు లండన్‌లో ప్రకటించెను. ఈయన హెరిరోజాతుల తరఫున వచ్చిన రాయబారి. హెరిరోజాతుల ప్రతినిధిగా తాము మనవిచేసుకొనుటకు ఐక్యరాజ్య సమితి కార్యాలయంవారు నిరాకరించిరని తెలియజేసెను. ప్రభుత్వానికి ప్రాతినిధ్యం వహించని వ్యక్తి సమితి ధర్మకర్తృత్వ సంఘంలో మాట్లాడ వీలులేదని, సమితి కార్యాలయంవారు స్కాట్సుకు లేఖ పంపిరి. నైరుతిఆఫ్రికా సమస్య ఒక ధర్మకర్తృత్వసంఘమునకు సంబంధించినదిమాత్రమే గాదు. మానవ హక్కులను, నాగరకత ప్రమాణములను సవాలు చేయుచున్న సమస్య యిది.

"దక్షిణాఫ్రికా ప్రస్తుత చర్యలు, నవ జాతిసమితియిచ్చిన మాండేటు అధికార వాసులకు అనుగుణంగానే ఉన్నవా? నైరృతి ఆఫ్రికా సర్వస్వతంత్రాధికార ప్రతిపత్తి యిప్పుడెక్కడ వున్నది? యీ సమస్యలపై మేము అంతర్జాతీయ న్యాయస్థానము తీర్పు అడిగెదము. ఈ విషయములో సమితి సభ్యత్వరాజ్యములయొక్క, ముఖ్యముగా బ్రిటిష్ కామన్వెల్తు రాజ్యములయొక్క తోడ్పాటును సాధించుటకు ప్రయత్నం జరుగుచున్నది" అని స్కాట్స్ అనెను.

## అరబ్ రాజ్యాలతో సమాలోచనలకు ఇస్రేల్ అంగీకారం

### సమావేశస్థలి, తేదీ యింకా నిర్ణయం కాలేదు

టెల్ అవీవ్, ఏప్రిల్ 11: ఐక్యరాజ్యసమితి పాలస్తీనా మధ్యవర్తి సంఘం పంపిన ఆహ్వానాన్ని స్వీకరించి, అరబ్ రాజ్యాలతో పరస్పరసమాలోచనల నెరపుటకు ఇస్రాయిల్ సమ్మతించినది. ఈసమాలోచనలు ఎచ్చట ఎప్పుడు జరుగునో యింకా నిర్ణయంకాలేదు. బహుశః మే 1 తే ప్రఖ్యాత స్విస్ వేసవి కేంద్రం కాసనీలో జరుగవచ్చునని ఐక్య రాజ్య సమితి వర్గాలవారు, జెనీవాలో జరుగవచ్చునని అది వరకు అనుకున్నారు.

క్రిందటివారం ఐక్యరాజ్య సమితిమధ్యవర్తి సంఘంతో బీరూట్‌లో సమావేశమైనప్పుడు, ఒక్క యిరాక్ తప్ప, మిగతా అరబ్ రాజ్యాలన్నీ యిస్రాయిల్‌తో, యీసమాలోచనలు సాగించుటకు ఒప్పుకొనినవి. యూరపులో వీప్ర దేశంలోనైనా జరిగే యీ సమాలోచనలు, సంధిసమాలోచనలు గావని సమితి రాజకీయ సంఘం నొక్కిచెబుతోన్నప్పటికీ, యీ సమాలోచనలు అరబ్బులు పరస్పరం ఒకచో కలుసుకొనుటద్వారా, తుది సంధి పరిష్కారమునకు ప్రాతిపదిక యేర్పడగలదని, రాజకీయ వర్గములవారు ఆశించుచున్నారు.

క్రితంవారం జరిగిన ఒక సరిహద్దు సంఘటన ఫలితంగా, సిరియా, ఇస్రాయిల్ మధ్య సంధి సంప్రదింపులు భగ్నంకాకుండా నివారించుటకు, ఐక్యరాజ్యసమితి అధికారులు యింకా విశ్వప్రయత్నం చేస్తున్నారు. ఉత్తర గెలీలీలో యీ సంధి సంప్రదింపులు తిరిగి ఈరోజు ప్రారంభం కావలసి ఉన్నది. ఐక్యరాజ్య సమితి సిబ్బంది రేపు ఉత్తర గెలీలీకి వెళ్లుచున్నది.

## సవరణ చేసిన తపాలా రేట్లు

(1949 ఏప్రిల్ 1 నుండి)

(a) ఇండియా, పాకిస్థాన్, సిలోనులలో బట్వాడా కావలసిన సాధారణ కరెస్పాండెన్సుకు పోస్టేజి.

| | | | |
|---|---|---|---|
| ఉత్తరములు | ... | మొదటి తులం | ... 2 అణాలు. |
| | | ప్రతి అదనపు తులం లేదా అందులో భాగమునకు | ... 1 అణా. |
| పోస్టు కార్డులు | ... | సింగిల్ | ... 9 పైసలు. |
| | ... | రిప్లయి | ... 1½ అణాలు. |
| ఇతర ఆర్టికిల్సు | | 1-4-49 తేదీకి పూర్వం ఉన్న రేట్లే. | |

(b) ఎయిర్ మెయిల్ ఆర్టికిల్సుకు పేరా (a)లో తెలిపిన చార్జీలను అదనముగా చెల్లింపవలసిన ఎయిర్ సర్‌చార్జీలు.

| క్లాసు | ఇండియాలో బట్వాడాకు | పాకిస్థానులో బట్వాడాకు | సిలోనులో బట్వాడాకు |
|---|---|---|---|
| ఉత్తరములు. | లేదు. | ప్రతి తులం లేదా అందులో భాగమునకు 1½ అణాలు. | ప్రతి తులం లేదా అందులో భాగమునకు 1 అణా. |
| పోస్టు కార్డులు. | లేదు. | ఒక్కొక్క దానికి 9 పైసలు. | ఒక్కొక్క దానికి 6 పైసలు. |
| ప్యాకెట్లుగాని న్యూస్ పేపర్లుగాని | ఒక్కొక్క తులం లేదా అందులో భాగమునకు 1 అణా. | ఒక్కొక్క తులం లేదా అందులో భాగమునకు 1½ అణాలు. | ఒక్కొక్క తులం లేదా అందులో భాగమునకు 1 అణా. |
| టెలిగ్రాములు | ఒక్కొక్క అక్షరమునకు 1 అణా. | ఒక్కొక్క అక్షరమునకు 1½ అణాలు. | ఒక్కొక్క అక్షరమునకు 1½ అణాలు. |

ఇండియాలో ఎయిర్ పార్సెల్సుకు సర్ చార్జి.

| | | |
|---|---|---|
| మొదటి 40 తులములకు | ... | సాధారణ పోస్టేజికి అదనముగా రు. 1/- |
| ప్రతి అదనపు 20 తులములకు | ... | సాధారణ పోస్టేజికి అదనముగా 8 అణాలు. |

ఇండియాలో ఉత్తరములకు పోస్టుకార్డులకు నీలమురంగు ఎయిర్ మెయిల్ లేబిల్సు అవసరం లేదు. ఇతర యితరములకు, విదేశీ ఎయిర్ మెయిల్ ఆర్టికిల్సుకు అన్నిటికి లేబిల్సు అంటించవలెను.

ఇండియన్ పోస్ట్సు అండ్ టెలిగ్రాఫ్సు డిపార్టుమెంటువారిచే ప్రకటింపబడినది.

## 'ఆఫ్ఘనిస్థాన్‌తో యుద్ధం అసంభవం'

### పాకిస్థాన్ ప్రతినిధి ప్రకటన

కరాచి, ఏప్రిల్ 11: వాయవ్య సరిహద్దు పొడుగునా పరిస్థితి చాలా ఉద్రిక్తంగా ఉండుటచేత, ఆఫ్ఘనిస్థానుకు, పాకిస్థానుకు యుద్ధం సంభవిస్తుందనే వదంతులు వట్టి అభూతకల్పనలని, పాకిస్థాన్ ప్రభుత్వమునకు సాన్నిహిత్యంగల ఒక వర్గమువారు ఖండించారు.

రెండు దేశాల్లోనూ, ఎవరో వక్రబుద్ధులు తప్ప, యుద్ధంద్వారా సమస్యలు పరిష్కారమవుతవని, యింకెవరూ అనుకోరు. అన్ని సమస్యలూ స్నేహపూర్వకమైన సంప్రదింపుల ద్వారానే పరిష్కారం కాగలవు.

## సమితి అధికారుల రక్షణకై సాయుధదళ నిర్మాణసమస్య

### ట్రిగ్వీలీ ప్రతిపాదనకు రష్యా ప్రతిఘటన: ప్రణాళిక అనుమతించదని ఎదురు వాదన

లేక్ సక్సెస్, ఏప్రిల్ 11: ప్రపంచంలో చెదురుచెదురుగా ఉన్న ఐక్యరాజ్యసమితి అధికారులను రక్షించేందుకుగాను, 800 మందితో సాయుధ రక్షకభట దళమును నిర్మించాలని, సమితికార్యదర్శి ట్రిగ్వీలీచేసిన ప్రతిపాదనను రష్యా నేడు తీవ్రముగా ప్రతిఘటించింది.

"ఇలాంటి ప్రతిపాదనకు, ఐక్యరాజ్య సమితి ప్రణాళికలో ఎక్కడా తావులేదని, ఒక్క భద్రతాసంఘానికి మాత్రమే, సాయుధసేనల నిర్మాణాధికారం ఉన్నదని ట్రిగ్వే ప్రతిపాదన, మండలినిత్రోసి రాజనుటకు ప్రయత్నమేనని, రష్యాప్రతినిధి జాకొబ్ మాలిక్ విమర్శించెను. ట్రిగ్వీలీ ప్రతిపాదనను, స్వీడన్, అమెరికా బ్రిటనులు సమర్థించినవి. రక్షకభటుల పనులేమిటో నిర్ధారణగా తెలియజేయాలని దక్షిణాఫ్రికా ఆశించింది.

ఢిల్లీలోని అమెరికన్ రాయబార కార్యాలయంలో నావికాప్రతినిధిగా నియమితుడైన కెప్టెన్ క్లారెన్స్ ఎడ్వర్డ్ కార్ట్‌నర్ 18వ తేదీన బొంబై చేరుతారు.

## ఇండియాకు ఎగుమతి దిగుమతి అప్పు

వాషింగ్టన్, ఏప్రిల్ 11: ఇండియాకు అంతర్జాతీయ బాంకు అప్పుఇస్తే మళ్లీ తాము అదనంగా అప్పు ఇవ్వడం అవసరం కాకపోవచ్చునని ఎగుమతి దిగుమతి బాంకు అధికారులు అనిరి. అయితే, ఎగుమతి దిగుమతి బాంకుకు అప్పు ఇవ్వాలని లేదని దీని అర్థంకాదని వారు విశదీకరించిరి.

## 'నీటిపారుదల సౌకర్యాలకు చిన్న పథకాలు అమలుకావాలి'

### అధికాహారోత్పత్తికి వ్యవసాయ శాస్త్రజ్ఞుల సమావేశ నిర్ణయాలు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 11: ఇక్కడ 4 రోజులుగా జరుగుతున్న వ్యవసాయ శాస్త్రజ్ఞుల సమావేశం శనివారంనాడు సమాప్తమైనది. సమావేశంలో అధికాహారోత్పత్తికి అనేక సిఫార్సులు చేయబడెను. రైతులకు ఎరువు, ఉక్కు, ఇనుము సామగ్రి వ్యవసాయపరికరములు సప్లైచేయడం ప్రభుత్వముయొక్క ప్రథమ కర్తవ్యం అనీ, యీపని సరిగా నెరవేర్చితే, అహారోత్పత్తికి ప్రధాన ప్రతిబంధకం తొలగిపోగలదని శాస్త్రజ్ఞులుసిఫార్సు చేసిరి. వ్యవసాయ శాస్త్రజ్ఞుల పరిశోధనా ఫలితములను అవశ్యముగా ప్రభుత్వముయొక్క అధికాహారోత్పత్తి కార్యక్రమానికి వినియోగపడునట్లు చూచుటకు వ్యవసాయ శాస్త్రజ్ఞులతో ఒక కార్యవర్గం నిమింపబడెను.

సింద్రీ ఎరువు కార్ఖానాలో ఉత్పత్తి ప్రారంభం అయ్యేవరకు విదేశాలనుండి ఎరువులు దిగుమతి చేసుకోక తప్పదు. కాబట్టి 1949 లోనూ, 50 లోనూ సాలీనా 1 లక్షటన్నుల సుపర్ ఫాస్ఫేట్ దిగుమతి చేయించడానికి భారత ప్రభుత్వం ఏర్పాట్లు చేయాలి.

నీటి పారుదల సౌకర్యముల అభివృద్ధికి ఎక్కడెక్కడ వీలైతే అక్కడ చిన్నచిన్న పథకములు అమలు జరపవలెను. నదులలో నుండి కాలువలలోనుండి నూతులలోనుండి నీరు యంత్రముల ద్వారాగాని ఇతర విధంగా గాని తోడి పొలములకు పెట్టడానికి సాధనములు ఏర్పరచాలి. బంజరు భూములను సాగుచేయడం, వ్యాపార పంటలు వేసే భూమిలో కొంతభాగమును ఆహారపంటల కిందికి తేవడం, చెరుకు పంటకు బదులు నూనెగింజల పంటను ప్రోత్సహించడం వారు సూచించిన కార్యక్రమంలోని మిగతా ప్రధాన అంశములు. 1951 లోగా భారతదేశం స్వయంపోషకం కావడానికి శాస్త్రజ్ఞులు ఈ కార్యక్రమం సిఫార్సు చేసిరి.

## పూనా కార్పొరేషన్

బొంబాయి, ఏప్రిల్ 12:— పూనా నగరమునకు పరిసర ప్రాంతములకు కలిపి ఒక మునిసిపల్ కార్పొరేషన్‌ను నెలకొల్పుటకు బొంబాయి ప్రభుత్వం నిశ్చయించింది.

## పసిఫిక్, హిందూమహా సముద్రాల సమస్యలు

కొలంబో, ఏప్రిల్ 11: వచ్చేమాసంలో లండన్‌లో జరుగబోయే కామన్వెల్తు ప్రధాన మంత్రుల సమావేశ సమయంలో భారత, ఆస్ట్రేలియా, సిలోనుల విదేశాంగ మంత్రులు ప్రత్యేకంగా మరియొక ప్రధాన సమావేశాన్ని జరుపుతారని తెలుస్తున్నది. బ్రిటిష్ ప్రధానమంత్రి ప్రత్యేక ప్రతినిధి, పాట్రిక్ గార్డన్ వాకర్ గారు ఈదేశాలతో విడివిడిగా జరిపిన సంభాషణలలో కలిగిన శాంతి, హిందూ మహాసముద్రాల ప్రాంతీయ సమస్యలపై వారు చర్చలను జరుపుతారు. —గ్లోబ్

## వింధ్యప్రదేశమంత్రి అరెస్టు

### లంచం పుచ్చుకొన్నాడని నేరారోపణ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 12: పన్నవజ్రపు గనుల వ్యాపారమండలి తాలూకు నరేడ్ దాస్ అనే వ్యక్తిదగ్గర లంచం పుచ్చుకొన్నాడనే నేరంపైన, వింధ్యప్రదేశ్ యూనియన్ ప్రభుత్వ పరిశ్రమల శాఖా మంత్రి శివబహదూర్‌సింగ్‌ను నిన్న రాత్రి ఢిల్లీపోలీసులు, రాజ్యాంగపరిషత్ భవనం వద్ద అరెస్టుచేసి లక్షరూపాయల జామీనా మీద విడుదలచేశారు. మంత్రివర్గములో ఆయన సహచరులే యీ జామీను యిచ్చారు. చేవ్రాళ్లున్న 250 వందరూపాయల నోట్లను నరేడ్‌దాస్‌వద్ద శివబహదూర్‌సింగ్ పుచ్చుకొన్నాడని ఆరోపణ. ఈ మొత్తం యిచ్చిన తరువాత, నరేడ్ దాస్ మెహతా పోలీసులకు వర్తమానం పంపి సింగ్ యిల్లును సోదాచేయమని అడిగాడట. ఢిల్లీ స్పెషల్ పోలీసులు, దివాన్ కాంతిలాల్ అహుజా అధ్వర్యాన యీ సోదా జరిపారు.

## కాందిశీకులకు ప్రభుత్వ సహాయం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 11: న్యూఢిల్లీ కాందిశీకుల రిజిస్ట్రేషన్ ఆర్డినెన్సులో "కాందిశీకులు" అన్న పదానికి ఏ నిర్వచనం ఉన్నదో ఆ నిర్వచనం కింద కివచ్చే వారికిమాత్రమే భారత ప్రభుత్వం ఢిల్లీలో పునరావాససౌకర్యములను కలుగజేస్తుంది. మిగతావారికి సహాయంచేయడం ప్రస్తుతం తనకు శక్తికిమించిన పనిగా భారత ప్రభుత్వం అభిప్రాయపడుతున్నది.

## నంగపర్వతఅధిరోహణ

బొంబాయి, ఏప్రిల్ 11: 26,629 అడుగుల ఎత్తువున్న నంగపర్వతశిఖరమును అధిరోహించుటకు స్విస్ జియన్ పార్వతీయుల జట్టు ఒకటి 1950 వ సం॥ మధ్యలో ఇండియాకు వచ్చుచున్నది. నంగపర్వతమును అధిరోహించుటకు ప్రయత్నం చేయడం యిది 6 వ సారి.

ఆస్లో విశ్వవిద్యాలయంలో దాన్నకి శాస్త్ర అధ్యాపకునైన ఆర్నీ నాస్ నాయకత్వమున పర్వతారోహణ బృందం ఒకటి వచ్చి శిఖరాన్ని చేరుకొనడానికి సులభమైన మార్గం వెదుకుతారు.

## ట్రూమన్ దృఢ విశ్వాసం

వాషింగ్టన్, ఏప్రిల్ 11: అరబ్ రాజ్యాలకు, ఇస్రాయిల్‌కు శీఘ్రముగా, న్యాయమైన వాస్తవికమైన సంధి ఒడంబడిక కుదరగలదని దృఢముగా విశ్వసిస్తున్నట్లు, ప్రెసిడెంట్ ట్రూమన్ నేడు ప్రకటించాడు.

ఇస్రాయిల్ కొత్త రాయబారి ఎలాత్ అధ్యక్షునికి తన నియామక పత్రములను సమర్పిస్తున్న సందర్భంలో ట్రూమన్ మాట్లాడుతూ పై విధంగా అన్నారు.

# "భారతదేశం రిపబ్లిక్ అయినంతమాత్రాన కామన్వెల్తు సంబంధాలకు విఘాతం రానవసరం లేదు"

## ప్రధానమంత్రి నెహ్రూ అభిప్రాయం

### బ్రిటన్ చేసేయుద్ధంలో భారతదేశంతప్పనిసరిగా చేరాలన్న నిర్బంధమేమీ లేదు

లండన్, ఏప్రిల్ 11: లండన్ 'డెయిలీ మెయిల్' ఢిల్లీ విలేఖరి నెహ్రూను సందర్శించిన సందర్భములో కామన్వెల్తులో భారత దేశానికి ఉండగల భవిష్యత్సంబంధాలనుగూర్చి నెహ్రూ తెలియజేసిన వివరాలను ఈదినం ఆ పత్రిక ముఖపత్రవ్యాసంగా ప్రకటించింది. స్వతంత్ర రిపబ్లిక్ రాజ్యంగా పొందటానికి భారతదేశానికగల హక్కును రేపు తాను లండన్ వెళ్లినప్పుడు ప్రతిపాదిస్తానని తెలుపుతూ, కామన్వెల్తులో భారతదేశానికి, భవిష్యత్తులో ఉండగల సంబంధాలను నెహ్రూ వివరించారు.

"ఇందులో యిప్పుడు హఠాత్తుగా పుట్టుకొచ్చిన క్రొత్తసమస్యేమీ లేదు. నా దేశం స్వతంత్ర రిపబ్లిక్‌గా వుండి కామన్వెల్తులో సభ్యత్వం వహించటానికి ఇబ్బందులు లేమీలేవు.

"కేవలం, నామరూపాదిభేదాల్లో తప్ప, జరగవలసిన క్రొత్త మార్పులు కూడా యేమీలేవు.

"ఆయా అధినివేశాలకు గవర్నర్ జనరల్ నియామకం రాజుచేత చేయబడుతున్నా వాస్తవానికి, అట్టివారిని ఆయా ప్రభుత్వాలే ఎన్నుకుని సూచించుతున్నయి. రాజనియామకం కేవలం లాంఛనప్రాయంగా మాత్రమే జరుగుతున్నది.

"అదేమో సరుగా, విదేశాలలో పని చేయటానికి నే నేరాయబారినైనా నిర్ణయించితే ఆ పేరును లాంఛనప్రాయంగా రాజుగారి అంతరంగిక కార్యదర్శికి పంపటం జరుగుతున్నది. వెంటనే ఆ నియామకానికి అంగీకారముద్ర వచ్చేస్తున్నది.

"స్వతంత్రభారత రిపబ్లిక్ అగ్రాధికారి గవర్నర్ జనరల్ స్థానే రిపబ్లిక్ అధ్యక్షుణ్ణి నియమించినంతమాత్రంచేత, పరస్పర ప్రయోజనాలు సాధించుకునే ఉద్దేశంతో కామన్వెల్తుదేశాల మధ్య పెంపొందించుకొనబడుతున్న సంబంధ బాంధవ్యాలకు విఘాతం రావలసిన అవసరమేమీ లేదు," అని నెహ్రూ వివరించారు.

'కామన్వెల్తురక్షణ కార్యక్రమంలో, భారతదేశం వహించగల బాధ్యతఎట్టిది?' అని వార్డుప్రైస్ వేసిన ప్రశ్నకు నెహ్రూ ఇలా సమాధానమిచ్చారు.

"యుద్ధ ప్రమాదాలలోకి యీడ్చుకుపోయే యేవిధమైన ఒడంబడికలతోనూ జోక్యం పెట్టుకోటం భారతదేశానికి మంచిది గాదు. "ఇతః పూర్వమల్లా, ప్రతి వ్యవహారానికీ యూరప్ కేంద్రంగా వుండి ఆసియా దాని తోకబట్టుకు నడిచే లాంఛలంగా వుండేది. కాని నేటిపరిస్థితి అలా కాదు. వ్యాపకసాయిక విప్లవోద్యమాలకంటేకూ, ఆసియా నేడు ప్రధానరంగస్థలంగా వుంది. ఆసియాలోని అనేక దేశాలలో నేడు పెంపొందిన అశాంతి అంతా అర్థం చేసుకుంటే, ఆ వుద్యమ ప్రభావమే నని విశదమౌతుంది.

"యుద్ధమనేది ఎక్కడ మొట్టుకున్నా దానిజ్వాలలు సర్వత్రా ముట్టుకునే అవకాశం వుంది. తన స్వప్రయోజనాలు సంరక్షించుకోటానికి భారతదేశం ఆ యుద్ధంలో పాల్గొనవచ్చు. కాని అలా పాల్గొనే అవసరం ఆనాటి పరిస్థితుల మీద ఆధారపడివుంటుంది.

"భారతదేశం లభింపజేయగల పరిమితమైన సైనిక సహాయాన్ని అభిలషించే కంటే, కామన్వెల్తులోని ఇతరదేశాలకు భారతదేశపుమైత్రి పరమ ప్రయోజనకారిగా వుంటుంది.

"బ్రిటన్ పాల్గొంటున్న యే యుద్ధంతోనూ యెట్టి జోక్యమూ కలిగించుకోకుండా, నిర్లిప్తంగా వేరుగా వుండటానికి భారతదేశానికి ఇప్పుడు స్వాతంత్ర్యం వుంది. అలాంటిస్వాతంత్ర్యం కామన్వెల్తుసభ్యత్వం వహిస్తున్న ప్రతి [illegible] ..." అన్నారు.

## హాంకౌ రేవుపట్టణంపై కమ్యూనిస్టులత్రిముఖ పురోగమనం

### పీపింగ్ సంప్రతింపులు ఫలింపగలవని అధికారవర్గాల ఆశ: ప్రధాన సమస్యలన్నీ పరిష్కారం

నాన్కింగ్, ఏప్రిల్ 10: యాంట్సే నది ఉత్తర తీరమున నున్న ప్రధానరేవు పట్టణము హాంకౌను మూడువైపులనుండి ముట్టడింప నేతెంచుచున్న చైనీస్ కమ్యూనిస్టుసేనలు మధ్యచైనాలోని సువిశాల మైదానములను అతిత్వరలో పూర్తిగా విముక్తము చేయగలవని నేటిరాత్రి కమ్యూనిస్టుల నూత్న చైనావార్తా సంస్థ ప్రకటించెను.

హాంకౌ పతనమైతే యాంట్సే ఉత్తర తీరమున 1000 మైళ్లపొడవు చీలిక కమ్యూనిస్టులపరమగును.

మధ్యచైనా మైదానములు హస్తగతమగుటతో, యాంట్సే దక్షిణ తీరమునకు దాటవలెనంటే కమ్యూనిస్టులకు ఒక ముఖ్య స్థావరము చేజిక్కినట్లగుననికూడ ఆ వార్తాసంస్థ ప్రకటించెను.

అప్పుడికమధ్య చైనాలో హాంకౌ, నాన్కింగ్ లమధ్యగల నదీతీరపు చీలిక తప్ప ప్రభుత్వమునకు మరే స్థావరమూ ఉండదని వార్తాసంస్థ ప్రకటించెను.

### పీపింగ్ సంధి చర్చలు

పీపింగ్‌లో జరుగుతున్న సంధిచర్చలలో, ఇప్పుడు ఒకే ఒక విషయం, అనగా, కొమింటాంగ్ సేనల పునర్నిర్మాణమును పర్యవేక్షించుటకు వీలుగా కమ్యూనిస్టు సేనలు యాంట్సేనదిని దాటి దక్షిణమునకు వెళ్లనివ్వబడవలెనను కమ్యూనిస్టులషరతు ఒక్కటే ప్రాధాన్యతను వచ్చినదని తెలియుచున్నది.

ఈ షరతు కమ్యూనిస్టుల 8 శాంతి షరతులలో నొకటి. దీనికి ప్రభుత్వ ప్రతినిధులు చూపుచున్న వైముఖ్యమువల్లనే యాంట్సేనది రేఖవెంబడి యుద్ధవిరమణ జరుగుట కాలస్యమగుచున్నదని ఇక్కడి అధికారవర్గములనుచున్నారు.

ప్రభుత్వ ప్రతినిధులు కమ్యూనిస్టు నాయకుడగు మావ్ ట్సేటుంగ్‌తో ఇంతవరకు రెండుసార్లు సమావేశమైరి. ప్రధాన విభేదములన్నీ సమసి ఒక్కటిమాత్రమే మిగులుటవలన సంప్రదింపులు ఫలించవచ్చునని అధికారులు ఆశపడుచున్నారు.

యాంట్సేనది ఉత్తర తీరానగల ప్రభుత్వ స్థావరములను 3 రోజులనుండి ముట్టడించుచున్న 50 వేల కమ్యూనిస్టు సైనికులు (3 సేనలు) నేడుకూడా ముట్టడి సాగించుచున్నారనీ, నాన్కింగ్‌కు నైరృతిగా 35 మైళ్ళలో మాత్రమే వున్న శిలింపాన్ బౌంషీలోనికి వారు చొచ్చుకొనిపోయినారనీ తెలియుచున్నది.

చైనా శాసనసభ సభ్యులను అరెస్టు చేసిన "రహస్యచారుల"ను దర్యాప్తు చేయవలసినదిగా తాను ఆజ్ఞాపించితినని నాన్కింగ్, షాంఘై దుర్గాధిపతి జనరల్ తాంగ్‌ఎన్‌పో నేడు ప్రకటించెను.

## అట్లాంటిక్ ఒడంబడికలో చేరమని రష్యాకు ఆహ్వానం

### నిరుపయోగమని బ్రిటిష్ విదేశాంగశాఖ సహాయ కార్యదర్శి ప్రకటన

లండన్, ఏప్రిల్ 11: అట్లాంటిక్ రక్షణ ఒడంబడికలో చేరవలసిందని ఇతర అట్లాంటిక్ రాజ్యాలనుకూడా కలుపుకొని బ్రిటన్ సోవియట్ రష్యాను కోరవలెనను కమ్యూనిస్టుసభ్యుని సూచనను బ్రిటిషు విదేశాంగశాఖ సహాయ కార్యదర్శి మెద్రూ తిరస్కరించెను. సోవియట్ రష్యా వైఖరిని గమనించిన అనంతరం ఇలాంటి సూచన కేవలం తార్కిక ప్రాధాన్యతతప్ప వేరేవీ ఉండవనికూడా ఈయన అన్నాడు.

## నాజీ నాయకులు

నూరెంబర్గ్, ఏప్రిల్ 11: హిట్లరు తలపెట్టిన మరాక్రమణ యుద్ధములకు ప్లానులు తయారుచేసినారన్న అభియోగంపై 8 గురు ఉన్నత నాజీనాయకులను అమెరికన్ యుద్ధనేరముల న్యాయస్థాన మొకటి నేడు వారి నేరములను ఖాయపరచినది.

## కామన్వెల్తు ప్రధాన మంత్రుల సమావేశం

### భారతదేశ వైఖరిపైనే ప్రధానచర్చ జరిగే సూచన

లండన్, ఏప్రిల్ 11: మరొక పదిరోజుల్లో ఇక్కడ జరుగనున్న అత్యంత ప్రధానమైన కామన్వెల్తు ప్రధానమంత్రుల సమావేశంలో పాల్గొనే నిమిత్తం ప్రధాన మంత్రులు అంతా వచ్చేవారం ఇక్కడికి రానున్నారు. ఈ సమావేశంలో, ముఖ్యంగా కామన్వెల్తు రాజ్యాంగం గురించి భారతదేశ వైఖరిపైనే చర్చ జరుగును. ప్రధానమంత్రులు ఒకవారంరోజులు బ్రిటిషుప్రధాని అధికార నివాసంలో ఆయన అధ్యక్షతన సమావేశమైఈ రాజ్యాంగసమస్యపైనా, ఇతర కామన్వెల్తు వ్యవహారాలపైనా చర్చలు సాగిస్తారు. ఒక్క భారత ప్రధానమంత్రితప్ప మిగతా వారందరూ ఏప్రిల్ 19వ తేదీకే ఇక్కడికి వస్తారు. నెహ్రూ మాత్రం ఏప్రిల్ 20 రాత్రి వస్తారు.

### పాకిస్థాన్ కామన్వెల్తునుండి తొలగదు

ఆక్లాండ్, ఏప్రిల్ 11: పాకిస్థాన్‌కు బ్రిటిష్ కామన్వెల్తునుండి తొలగిపోవలసిన ఉద్దేశ్యం లేదని ఆస్ట్రేలియాలోని పాకిస్తాన్ వాణిజ్య కమీషనర్ కె. హెచ్. రహిమాన్ నేడిక్కడ ప్రకటించెను.

## సుహ్రావర్దీ ప్రత్యర్ధికి విజయం

ఢక్కా, ఏప్రిల్ 11: పాకిస్థాన్ రాజ్యాంగపరిషత్తుకు తూర్పు బెంగాల్ నుండి అభ్యర్ధిగా నిలుచున్న హెచ్. ఎస్. సుహ్రావర్దీని బ్రహ్మాండమైన మెజారిటీతో ముస్లింలీగ్ వారి అభ్యర్థి షాంసుల్‌హక్ అనే ప్లీడరు ఓడించిఆస్థానమునకు ఎన్నుకోబడెనని ప్రకటింపబడెను. ఎవరికెన్ని ఓట్లు వచ్చినవో ఇంకా తెలుపబడలేదు.

## ఎరిట్రియా రాజధాని అస్మారాలో సాయుధ గల్లంతులు

అస్మారా, (ఎరిట్రియా) ఏప్రిల్ 11: అస్మారా పట్టణంలోని ఒక వసతి గృహంపై నేడు స్థానిక ప్రజలు సాయుధంగా దాడి జరిపి ఒక ఇటాలియన్‌ను హత్య చేసి చంపినందువల్ల, నగరంలో రేపు కర్ఫ్యూ అమలుచేయబడనున్నది. బ్రిటిష్ సైనికులు అస్మారా అంతటా పహరా తిరుగుచున్నారు.

## వర్షాకాలంరాగానే తిరిగి తమ కార్యక్రమంసాగింపకమ్యూనిస్టులనిర్ణయం

### ఒకనెలలో, ఒక్కతాలూకాలో 50 మంది హత్య

హైదరాబాదు, ఏప్రిల్ 11: వర్షఋతువు ప్రారంభంకాగానే తమ ఘాతుకచర్యలను తిరిగి ప్రారంభింప వరంగల్‌జిల్లా కమ్యూనిస్టులు నిశ్చయించిరని యిచ్చటికి వచ్చినవార్తలు తెలుపుచున్నవి.

### మార్చిలో 50 హత్యలు

హైదరాబాదు, ఏప్రిల్ 11: 1949 సం॥ మార్చిలో కమ్యూనిస్టులు 50 మంది మహబూబాబాద్ తాలూకా ప్రజలను హత్య చేసిరని ఆ తాలూకా వ్యవసాయ సంఘమువారు గావించిన ప్రకటన తెలుపుచున్నది. కమ్యూనిస్టుల, వారి అభిమానుల ఆస్తులను జప్తుచేయవలసినదని ఈ సంఘమువారు మిలిటరీ ప్రభుత్వమువారికి విజ్ఞప్తి గావించియున్నారు.

### హైద్రాబాదు మహిళలకు స్వామీజీ ఉద్బోధ

హైదరాబాద్, ఏప్రిల్ 11: హైదరాబాద్ సంస్థానంలో, ముస్లిం మహిళలు సంకుచిత మతతత్వమును విడనాడవలెనని, స్త్రీలుకూడా పురుషులతో సమానస్థానమును నిలబెట్టి ముందుకు సాగిపోవలెననీ, సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షుడు స్వామి రామానందతీర్థ నిన్న నిక్కడ ముస్లిం స్త్రీల సమావేశంలో విజ్ఞప్తిచేసెను. ముస్లింస్త్రీలు సంస్థాన కాంగ్రెస్‌లో శతసహస్ర సంఖ్యాకంగా చేరి కాంగ్రెస్‌ను బలపరచవలెనని ఉద్బోధించిరి. దేశంలో నిజమైన జాతీయతను పెంపొందించుటలో మహిళలు అపారంగాతోడ్పడగలరనీ, స్వామీజీ చెప్పెను.

### హైదరాబాదులో కార్మికులపై లాఠీచార్జి

హైదరాబాదు, ఏప్రిల్ 11: హైదరాబాదు ఐరన్ అండ్ స్టీల్ వర్క్సుకు చెందిన కార్మికుల మూకపై నేడు పోలీసులు లాఠీచార్జి గావించిరి. వీరు గత ఆరువారములనుండి సమ్మె చేయుచున్నారు. కార్మిక యూనియన్ అధ్యక్షుడు, కార్యదర్శితో సహా 10 మంది కార్మికులు నేడు అరెస్టుకాబడిరి.

### నెల్లిమర్ల, చిట్టివలస జ్యూట్ మిల్లులో తగాదా

మదరాసు, ఏప్రిల్ 9: నెల్లిమర్ల, చిట్టివలసజ్యూట్‌మిల్లుల యజమానులు, కార్మికుల మధ్య ప్రావిడెంటుఫండు, బోనసు, జీతములనిర్ణయము కార్మికులకు సౌకర్యములు, జీతములమీద కలప్పు, ప్రమోషను నియమములు, తీసివేయబడిన కార్మికులను తిరిగి తీసుకొనుట మొదలగు విషయముల పై ఏర్పడిన తగవు పరిష్కారము నిమిత్తం పారిశ్రామిక తగవుపరిష్కార సంఘమునకు పంపుటకు పారిశ్రామిక తగవుల చట్టము సెక్షన్ 10 (1) (సి)క్రింద గవర్నరు ఉత్తరువు చేసిరి.

## లండను వర్గాలలో వ్యాఖ్యాన సంచలనం

లండన్, ఏప్రిల్ 11: "చిరకాల ఆహ్వానము నంగీకరించి" బర్మా ప్రధాని థాకిన్‌నూ ఇండియాకు వచ్చుటపై లండను రాజకీయ వర్గములలో వ్యాఖ్యాన సంచలనం బయలుదేరినది.

బర్మా ప్రధాని నాగా రాగమునకు, దాని సమయమునకు, బర్మాలోని పరిస్థితి, లండనులో జరుగనున్న కామన్వెల్తు ప్రధానుల సమావేశము, [illegible] బర్మా సమావేశము (ఢిల్లీ) ఇవన్నీ ఒకదానితో నొకటి సంబంధముగలవియేయని ఇక్కడి వ్యాఖ్యాతలు భావించుచున్నారు.

## అణుశక్తి ఆయుధాల నిర్మాణానికి మరింత ధనం మంజూరి

వాషింగ్టన్ ఏప్రియల్ 11: అణుశక్తి ఆయుధాల నిర్మాణాన్ని ఉధృతం చేయుటానికి అమెరికా ప్రభుత్వం ఈరోజు మరింత ధనం మంజూరు చేసింది. లోగడ మంజూరుచేసిన 191,393,838 డాలర్లుకాక ఇప్పుడు అదనంగా 210,208,875 డాలర్లు మంజూరు చేసింది. ఈ సొమ్ముతో ఆటంబాంబులూ, ఇతర ప్రధానాయుధాలూ తయారు చేయబడతై.

## జర్మను నౌకాదళ చరిత్ర

### వ్రాయవలసినదని హిట్లరు నౌకాధిపతికి అమెరికా ఉత్తరువు

వాషింగ్టన్, ఏప్రిల్ 11: ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామములో జర్మను నౌకాదళ చరిత్రను వ్రాయుటకు హిట్లరు నౌకాదళాధిపతిగానుండిన అడ్మిరల్ షినీవాడును అమెరికను ప్రభుత్వము నియోగించెనని తెలియుచున్నది. ఈ నౌకాదళాధిపతికి బ్రేమెన్‌లో ఒక యిల్లిచ్చిరి. మాజీ నౌకాదళాధికారులనుండి ఆయన తన సిబ్బందిని ఎంచుకొనుటకుగూడ అనుమతి యొసంగిరి. ఐరోపాలో దినదినప్రవర్ధమానమగుచున్న కమ్యూనిజమును అరికట్టుటకు జర్మనీతో యితోధికముగా సహకరించు అభిలాషను అమెరికను ప్రభుత్వ నిర్ణయము సూచించుచున్నదని అభిజ్ఞవర్గములవారనుచున్నారు.

## మాధవరంలో వయోజన విద్యాకేంద్రం

తాడేపల్లిగూడెం, ఏప్రిల్ 8: మాధవరంగ్రామంలో గాంధీ వయోజన విద్యాకేంద్రం స్థాపించబడింది. దీనికి జిల్లా ప్రగడ ప్రకాశరాయుడుగారు ప్రారంభోత్సవం జరిపిరి. ఈ సందర్భంలో ఎస్. శేషయ్యగారి అధ్యక్షతను బహిరంగసభ జరిగెను. వయోజన విద్యావశ్యకతను గురించి పలువురు ప్రసంగించిరి. ఈకేంద్రంలో కె. వి. రత్నంగారు అధ్యాపకులుగా నియమించబడిరి.

## సెక్రటేరియట్ ఆంధ్ర సంఘం

సెక్రటేరియట్ ఆంధ్ర సంఘమువారు సోమవారం సాయంత్రం ఫోర్టు సెంట్ జార్జిలో శ్రీరామనవమి ఉత్సవముల సందర్భమున సీతాకల్యాణోత్సవము జరిపిరి. శ్రీ కల్లూరి వీరభద్రశాస్త్రిగారు శ్రీ వాల్మీకి రచించిన రామాయణ ప్రాశస్త్యమును, తెలుపుచూ సూర్యచంద్రాదులు ఉన్నంతవరకూ ఆ ఉద్గ్రంథము నిలచి ఉండగలదనియు, రాముడు మనుష్యమాత్రులు రెక్కలు గట్టుకొని పైకెగిరి అందుకోవలసిన వ్యక్తిగా కనియు, పూర్తిగా మానవాతీతుడు గాడనియు, అతనిని మనుష్యులందరికి ఆదర్శపురుషుడుగా అభివర్ణించి వాల్మీకి ఉత్తమసర్గ సూత్రములను బోధించెననిరి. ఆధునిక యుగములో మహాత్ముని కన్న మిన్న అయిన రామభక్తాగ్రేసరుడు లేడనియు ఆయనవర్ణాశ్రమ ధర్మవ్యవస్థ ఉత్తమోత్తమమని పలుమారులు ఉద్ఘోషించెననియు తెలిపిరి. త్యాగరాజు, రామదాసు, వాల్మీకి మున్నగు రామభక్తశిఖామణులు రామకథామృత సారమును ప్రపంచమునకు అందచేసినారనియు, వారి రచనలలో ఒక్కొక్కరి రచనలందు ఒక్కొక్క విశిష్టత, వైలక్షణ్యము ఉన్నవనిరి. శబరి, గుహుడు, జటాయువు వానరమూకల హృదయాపరక్తి, భక్తి ప్రపత్తులు అత్యుత్తమముగ చిత్రింపబడెననియు రామాయణము నందలి తళుకులు, భక్తులకు ఒక విశ్వమైన దీప్తిని, తేజస్సును, ఉత్సన్నము చేసి, ప్రాభవమును కల్గించుననిరి.

శ్రీరాముని జగత్పితగాను, సీతామ్మవారినిజగన్మాతగాను వాల్మీకికల్యాణోత్సవమును మనోజ్ఞముగాను హృదయరంజకముగానువర్ణించెననియు,అదేభావమున సీతమ్మ మాయమ్మ, శ్రీరాముడు మాదు తండ్రి, అని త్యాగరాజు గానముచేసెననియు, రామకల్యాణమహోత్సవము ఆసేతుశీతాచలపర్యంతం భారతీయులందరూ భక్తిప్రపత్తులతో జరుపుకొను పర్వదినోత్సవమనిరి. భక్తిచేగాని, శత్రుత్వముచేగాని, భీతిచేగాని ఆర్తిచేగాని భగవంతునిపై అనురక్తి కల్గినచో మోక్షమార్గ మదియే ననిరి.

ప్రసాదము పంచిపెట్టినమీదట రామమూర్తిగారి అభివందనములతో సభ ముగిసెను.

## అరాచకమును అరికట్టి శాంతిని నెలకొల్పగలననిబర్మాప్రధానివిశ్వాసం

### తన భారతదేశాగమన కారణాలపై థాకిన్‌నూ వ్యాఖ్య: రేపు నెహ్రూతో సంప్రతింపులు

కలకత్తా, ఏప్రిల్ 11: పండిట్ జవహర్లాల్ నెహ్రూను కలిసికొనుటను బర్మాప్రధాని థాకిన్‌నూ ఢిల్లీకివెళ్ళుచు త్రోవలో నేడిచ్చట ఆగెను. కామన్వెల్తు ప్రధానుల సమావేశమునకు హాజరగుటకై లండను వెళ్ళుటకు ముందు పండిట్ నెహ్రూ తన్ను చూడగోరెనని థాకిన్‌నూ పత్రికా విలేఖరులతో చెప్పెను.

బర్మా పరిస్థితిని అదుపులోనికి తెచ్చుట కెంతకాలము పట్టునో తాను చెప్పలేననీ, కాని అదుపులోనికి తేగలమనుటలో సందేహము లేదనీ, థాకిన్‌నూ ఉద్ఘాటించెను.

బర్మాలో దేశవ్యాపితముగ ఎన్నికలు జరిపించుటకై "తెల్లపట్టీ" ప్రజా వాలంటీర్ సంఘముతో సమాధాన పడవలెనని తాము సంప్రదింపులు జరుపుచున్నట్లు తెలుపుచు, మొదట ప్రకటించినట్లు జూలైలో ఎన్నికలు జరుపుట సాధ్యమగునోకాదో తాను గట్టిగా చెప్పలేనని కూడ బర్మాప్రధాని పత్రికా విలేఖరులతో చెప్పెను. ఎన్నికల సాధ్యాసాధ్యములవిషయమై నిర్ధారణ చేయునిమిత్తమై, రంగూను హైకోర్టు ప్రధానన్యాయమూర్తి సర్ [illegible] నాయకత్వం క్రింద ఒక కమీషన్‌ను బర్మీస్ పార్లమెంటు నియమించినట్లు థాకిన్‌నూ తెలియజేసెను.

థాకిన్‌నూ నేటి రాత్రి కలకత్తా ప్రభుత్వ భవనములో అతిథిగా గడిపి రేపు ప్రాతఃకాలమే ఢిల్లీకి బయలుదేరును.

• చాలకాలము క్రిందటనే పండిట్ నెహ్రూచే ఢిల్లీకి ఆహ్వానింపబడిన థాకిన్‌నూ నేటి మధ్యాహ్నం డండం విమానాశ్రయంలో దిగీ దిగుటతోడనే భారతీయ ప్రజలకు తన స్నేహభావమును వెల్లడించెను.

"భారతదేశీయులకు బర్మా ప్రజల స్నేహ సుహృద్భావములను అందించుటకే మా పొరుగుదేశమైన ఇండియాకు వచ్చితిని. నన్ను వచ్చి కలిసికొమ్మని పండిట్ నెహ్రూ ఎందుకు కోరెనో నాకు తెలియదు. బహుశా ఆయన లండను వెళ్ళుటకు ముందు నన్ను చూడవలెనని ఆయన తలచియుండవచ్చును. నేనిప్పుడు సంపూర్ణముగా పండిట్ నెహ్రూ హస్తములందున్నాను. ఈదేశములో నేను చేయవలసిన కార్యక్రమ మెట్టిదో చెప్పుటకష్టము." అని ఆయన అన్నాడు.

క్రొత్తగా ఆర్జింపబడిన స్వాతంత్ర్యమును నష్టపడ కలుపుచు, బర్మాను అరాచక స్థితికి తీసుకుపోవుచున్న విప్లవకారులను విచ్ఛిన్నపరుపగలుగుదుమని విశ్వసింతుము, కరేన్లతో బర్మీస్ ప్రభుత్వము జరిపిన సంప్రదింపులు విచ్ఛిన్నమగుట కథాకిన్‌నూ చింతించుచున్నాననెను. నిర్దిష్ట విషయమై తాము చేసిన ప్రకటన కాక ఇంక చెప్పదగినదేమీ లేదని కూడ ఆయన అనెను.

ఎన్నికలను గూర్చి చెప్పుచు, కరేన్లను, ఇతరులను ఎన్నికలలో పాల్గొనవలసినదని తాము ఆహ్వానించితిమనీ, ఆ ఎన్నికలలో ప్రజలు వారికే అధికారము నొసంగినచో వారిష్టము వచ్చినట్లు వారు దేశమును పాలింపవచ్చుననీ, ఎన్నికలు ఎప్పుడు జరుగవలసినదీ నిర్ణయించు అధికారము తాము క్రొత్తగా నియమించిన కమీషనుకే వదలి వేయబడినదనీ థాకిన్‌నూ వెల్లడించెను.

### ఇండియా, పాకిస్థాన్ ప్రధానులతో ప్రధానమైన చర్చలు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 11: రేపిక్కడకు పండిట్ నెహ్రూ అతిథిగా వచ్చుచున్న బర్మీసు ప్రధాని థాకిన్‌నూ ఒకరోజు మాత్రమే ఇక్కడ ఉండునని తెలియుచున్నది. బర్మాకు తిరిగి వెళ్లుటకు ముందు ఆయన కరాచీకూడా వెళ్లి పాకిస్థాన్ ప్రధాని లియాకతాలీఖాన్‌తో సంభాషించును.

థాకిన్‌నూ ఏపనిమీదవచ్చుచున్నాడో సరియైన వివరములు ఇక్కడి బర్మీస్ రాయబార కార్యాలయంవారు కించిత్తయినా బయటపెట్టుటలేదు. అతని రాక ప్రస్తుత బర్మా పరిస్థితికి అతి ప్రధానముగా సంబంధించినదేనని, ఇక్కడి రాజకీయ అభిజ్ఞులు భావించుచున్నారు. బర్మాకల్లోలమునకు శాంతియుత పరిష్కారమును సాధించుటకై మార్గముల న్వేషింపవలెనని ఢిల్లీలో జరిగిన బర్మా సమావేశము చేసిన సూచనకు థాకిన్‌నూ ఇచ్చిన సమాధానము అందిన తరువాతనే ఆయనకు ప్రస్తుతాహ్వానము పంపబడినదని కూడ తెలియుచున్నది.

పండిట్ నెహ్రూ, లియాకతాలీఖానులకు థాకిన్‌నూ తనదేశపు దృక్పథమును వ్యక్తీకరింపగలడనీ, వారి సంభాషణలలో బర్మా యిద్దరిపు ఎనుమతికి ధనసహాయము చేయు విషయముకూడా ఉండవచ్చుననీ, అభిజ్ఞవర్గములు భావించుచున్నట్లు, రంగూనునుండివచ్చినవార్త తెలుపుచున్నది.

## భోపాల్ భవిష్యత్తు

### 18-వ తేదీన కేంద్ర ప్రభుత్వాధ్వర్యం

(ఆంధ్ర పత్రిక విలేఖరి)

న్యూఢిల్లీ, ఏప్రిల్ 11: భోపాల్ సంస్థాన భవిష్యత్తును తేల్చివేయటానికి నవాబుకు ఇంకా రెండురోజులు గడువు భారతప్రభుత్వం ఇచ్చింది. కేంద్రప్రభుత్వం ఈనెల 15వ తేదీనే సంస్థానంపై అధికారాన్ని స్వాధీనపరచుకొనదలచింది. కాని, 18-వ తేదీవరకు గడువు పొడిగించబడినది. భారతప్రభుత్వ సంస్థానశాఖ సలహాదారు వి. పి. మీనన్‌గారు 18-వ తేదీనే భోపాల్‌కు బయలుదేరి వెళ్లుతున్నారు. సంస్థానంపై కేంద్రప్రభుత్వాధికార స్వీకారానికి సంబంధించిన అంతిమ ఏర్పాట్లను నవాబుతో మీనన్‌గారు చర్చించి సంస్థాన భవిష్యత్తును ఆతేదీనే తేల్చివేస్తారు.

ఢిల్లీలో రాజప్రముఖుల సమావేశమై చేసిన నిర్ణయం ప్రతిని భారతప్రభుత్వ సంస్థానశాఖ వివిధసంస్థానాలకూ అందజేస్తున్నది.

వివిధ సంస్థానాలు భారతప్రభుత్వం చేసుకున్న ఒప్పందంలో ఈ తీర్మాన ఫలితంగా ఒకక్రొత్త క్లాజును చేర్చారు. ఈ క్లాజుద్వారా సంస్థానాధీశ్వరుల ప్రత్యేకాధికారాలపై పరిశీలన చేయడానికీ, అజమాయిషీ వహించడానికీ అదుపులోనికి తేవడానికీ కేంద్రప్రభుత్వానికి అధికారం సంక్రమిస్తున్నది.

## మహాకోసల రాజకీయ సమావేశం

రాయిగఢ్, ఏప్రిల్ 10: సి. పి. ప్రధానమంత్రి పండిట్ రవిశంకర్ శుక్లా మహాకోసల రాజకీయ సమావేశమును ప్రారంభించుచూ ఛత్తీస్‌గఢ్ సంస్థానములోని ఆదివాసుల యోగక్షేమములను రాష్ట్రప్రభుత్వం సర్వదా సంరక్షించగలదని హామీ ఇచ్చెను. సోషలిస్టులు కమ్యూనిస్టులు మొదలైన అధికార పిపాసులైన వర్గాలమాటలు వినవద్దని పార్లమెంటరీ పద్ధతుల ద్వారా ప్రజలు తమ ఆశయాన్ని సాధించుకోవలెననీ శుక్లాగారు హెచ్చరించిరి.

ఛత్తీస్‌గఢ్ సంస్థానముల పరిపాలన విషయమై సలహా ఇవ్వడానికి 24 మంది సభ్యులతో గూడిన సలహా సంఘం నియమింపబడినదనీ, శాసనసభకు ఈ ప్రాంతమునుండి సభ్యులు ఎన్నుకొనబడేవరకు సలహా సంఘం పనిచేస్తూ ఉంటుందనీ, ప్రధాని చెప్పెను. సంకుచిత స్వార్థ పరత్వమును వీడి దేశశ్రేయస్సుకై సర్వులూ సమిష్టిగా కృషి చేయవలెనని శుక్లాగారు విజ్ఞప్తి చేసిరి. సమావేశమునకు మహాకోసల రాష్ట్ర కాంగ్రెసుసంఘ అధ్యక్షుడు సేఠ్ గోవిందదాస్ అధ్యక్షత వహించెను.

గాంధీ మహాత్మునికి శ్రద్ధాంజలులు అర్పించు తీర్మానము చేయబడెను.

## చికాకోల్‌లో విద్యుచ్ఛక్తి సరఫరా

### ప్రభుత్వానికి విన్నపం

చికాకోల్, ఏప్రిల్ 6: ఈ మునిసిపాలిటిలోనున్న ఎలక్ట్రిక్ కార్పొరేషన్ నుండి విద్యుచ్ఛక్తి సరిగా సరఫరా అగుట లేదనీ, అప్పుడప్పుడు దీపాలు వెలుగక పోవటం సంభవిస్తోందనీ,యిందుచే ప్రజలు చాల యిబ్బంది పడుచున్నారనీ, కాబట్టి ప్రభుత్వం వెంటనే యీ పట్నమును కూడ "గ్రిడ్ స్కీము" క్రిందకు తీసుకొని విద్యుచ్ఛక్తిని సరఫరా చేయించవలసిందని కోరుతూ నిన్న సాయంకాలం గరిమెళ్ళ కుమారస్వామి గారి అధ్యక్షతను జరిగిన పౌరసభలో ఒక తీర్మానం చేయబడెను. ఈ తీర్మానప్రతిని రాష్ట్ర ఆరోగ్య శాఖామంత్రికి, మూలెల ప్రధానికి ఎలక్ట్రిక్ ఇంజనీరుకు పంపుటకు నిశ్చయించిరి.

# ఇంకా కొంతకాలము వరకు ప్రతికంట్రోలు అవసరము

## ఢిల్లీ సభవారి అభిప్రాయము

న్యూఢిల్లీ, ఏప్రిల్ 11 : నేడు ఢిల్లీలో ఇండియా ప్రభుత్వ పరిశ్రమల, సప్లయి శాఖ మంత్రి డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీగారి అధ్యక్షతను జరిగిన సభలో ప్రత్తి కంట్రోలును సంబంధించిన విషయము లన్నియు, రాబోవు ప్రత్తిపంటకు ధరలు నిర్ణయించు విషయముతో సహా అన్ని విషయములు చర్చింపబడెను. ద్రవ్యోల్బణమును అరికట్టుట ఇండియా ప్రభుత్వమువారి విధానమగుటచే యింకా కొంతకాలము వరకు ప్రత్తికంట్రోలు అవసరమని సభవారు అభిప్రాయపడిరి.

ఈ సభకు రాష్ట్రముల ప్రతినిధులు, సంస్థానముల ప్రతినిధులు, ప్రత్తి పారిశ్రామికులు హాజరైరి. మద్రాసు పక్షమున శ్రీ అనంతశయనం అయ్యంగారు శ్రీ టి. ఏ. రామలింగం చెట్టియారుగారు సభలో పాల్గొనిరి.

ప్రత్తిధరలో ఎట్టిమార్పు అవసరమైనను, ఆ మార్పు రాబోవు పంట సంవత్సరమునందు మాత్రమే అమలులోనికి రావలెనని, ప్రస్తుత ప్రత్తి పైరుకుగాని, ప్రత్తినిల్వలకుగాని వర్తింపరాదని సభవారు అంగీకరించిరి. ఎట్టిమార్పు అవసరమో పరిశీలించుటకు ప్రత్తిపండించు రాష్ట్రముల, సంస్థానముల ప్రతినిధులతో కూడిన ఒక 'అడ్ హాక్' కమిటీని యేర్పరుప సభవారు నిశ్చయించిరి.

అధిక ఆహారోత్పత్తికై రాష్ట్రములు గావించుచున్న కృషికి అంతరాయము కలుగకుండుటకుగాను ప్రత్తిధరలను ఆహారధాన్యముల ధరలతోను, పోటీచేయు ఇతర పైరుల ధరలతోను సమన్వయించవలెనని సభవారు అంగీకరించిరి. ఆహారోత్పత్తి పథకములకు భంగము కలుగకుండా ప్రత్తి పంటను హెచ్చింపవలెనని, వెంటనే అవసరమైన చర్య గైకొనవలెనని సభవారు కోరిరి.

అవసరమైనప్పుడు ప్రత్తినిల్వలను రిక్విజిషన్ చేయు రాష్ట్రీయ ప్రభుత్వములు, సంస్థాన ప్రభుత్వములు సంశయింపరాదని, ఇందుకు కావలసిన అధికారములను కేంద్రప్రభుత్వమువారు గూడ సాధ్యమైనంత త్వరలో పుచ్చుకొనవలెనని సభవారు అభిప్రాయపడిరి.

దేశములో మిల్లుప్రత్తి రవాణాపై అనవసర నియమ నిషేధములు విధింపరాదని సభవారు అభిప్రాయపడిరి. విదేశములలో ప్రత్తి పుష్కలముగా నుండుటచేత దేశములోనికి ప్రత్తిని విరివిగా దిగుమతి యగుటకు అనుమతించవలెననిరి.

సప్లయి శాఖ మంత్రి డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీగారు సభను సమాప్తము గావించుచు సభవారు వెలిబుచ్చిన అభిప్రాయములను ప్రభుత్వమువారు జాగ్రత్తగా విచారించెదరనిరి. సభవారి సలహాలను విచారించి ప్రభుత్వమువారు ఈ నెలాఖరులోపుగా తమ నిర్ణయములను ప్రకటింపగలుగుదురని డా॥ శ్యామప్రసాద్ ముఖర్జీగారు ఆశించిరి.

### పౌరవిమానయానంలో భారతదేశానికి నాల్గవస్థానం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 11 : పౌరవిమానయానంలో స్వతంత్రభారతదేశానికి ప్రపంచంలో ఈనాడు నాల్గవస్థానం లభించింది. ద్వితీయ ప్రపంచయుద్ధాంతాన ఓం ప్రథమంగా ప్రారంభమై ఈ శాఖ అనతికాలంలోనే అభివృద్ధిచెంది నేటికి ఉచ్ఛదశ నందుకొన్నది. భారతదేశంలో పౌరవిమానయానశాఖ ఏ దేశంలోనూ అభివృద్ధి చెందనంత వేగంగ అభివృద్ధి చెందింది. ఇండియాలో 7 పౌరవిమానయాన కంపెనీలు పనిచేయుచున్నవి. దేశంలో 43 విమానాశ్రయములు ఉన్నవి.

1949-50లో పౌరవిమానయాన పథకములక్రింద 2 కోట్ల 92 లక్షల రూపాయలు వెచ్చించడానికి భారతప్రభుత్వం ఉద్దేశించుచున్నది.

విమానయానానికి కావలసిన సిబ్బందిని తర్ఫీదుచేయుటకు సహారాన్పూరులోనూ అలహాబాదులోనూ శిక్షణ కేంద్రములు ఏర్పాటు చేయబడినవి.

### ధర్మవరం తాలూకా ఎరుకల మహాసభ

ధర్మవరం, ఏప్రిల్ 6: ఈ తాలూకా ఎరుకలమహాసభ శ్రీ బి. అంజనప్పగారి అధ్యక్షతను నిన్న జరిగెను. వెనుకబడిన జాతులవారు తమలో పాలను చక్కజేసుకొని ప్రభుత్వమునకు నచ్చచెప్పి సహాయం పొందవలెననీ, ఎవరో ఏమో చేసెదరని ఆశతో కూర్చొనకుండా తమ అభివృద్ధికి తామే పాటుపడవలెననీ శ్రీ పురుషోత్తముడు విద్యనేర్చుకోవలసిందనీ అధ్యక్షులు చెప్పిరి. ప్రభుత్వం సి. టి. చట్టమును పూర్తిగా తొలగింపవలెననీ, ఎరుకలకు విద్యాసౌకర్యాలు కలిగించవలెననీ, బంజరు భూముల నిప్పించవలెననీ, తీర్మానించిరి.

### భారతదేశం బ్రిటిష్ కామన్వెల్తులో చేరరాదు

#### ఇంగ్లండులో భారతీయ విద్యార్థి సంఘ మహాసభ

విల్లెస్డెన్ ఏప్రిల్ 10 : ఇంగ్లండులోను ఐరోపా ఖండ రాజ్యములలోను ఉన్న టువంటి భారతీయ విద్యార్థి సంఘముల మహాసభ ఇంగ్లండులో విల్లెస్డెన్ పట్టణమందు అయిదుదినములు సమావేశమై నేటితో సభ ముగింపబడెను. భారతదేశము అంతర్జాతీయ కలహములందు తటస్థముగా నుండవలెననియు బ్రిటిష్ కామన్వెల్తులో చేరరాదనియు, ఆర్థికంగా, రాజకీయముగా సైనికముగా ఏ అన్యరాజ్యమున్ను భారతదేశంపైన ప్రాబల్యము వహించుటకు అవకాశమీయరాదనియు భారతదేశము సర్వస్వతంత్రమైన ప్రజారాజ్యముగా నుండవలెననియు తీర్మానములు చేయబడెను.

పశ్చిమరాజ్యాల కూటంతోగాని అన్యరాజ్యాలతో యుద్ధం చేయవలెననే అభిప్రాయంతో ఏర్పాటు అయిన ఏ ప్రాంతీయ రాజ్యకూటంలోగాని భారతదేశం ప్రవేశించకూడదని తీర్మానింపబడెను.

# మన్భూమ్ సత్యాగ్రహాన్ని విరమించాలని కాంగ్రెసు కార్యవర్గ ఆదేశం

## వింధ్యప్రదేశ రాష్ట్రీయకాంగ్రెస్ సంఘం రద్దు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 11 : పరిష్కారము కాకుండా మిగిలియున్న పరిపాలనా సంబంధములగు విషయములను, అంగనిర్మాణమునకు సంబంధించిన విషయములను పరిష్కరించుటకై నేడు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు మూడు గంటలసేపు సభ జరిపిరి. అనంతరము సమావేశము సమాప్తమయ్యెను. సభకు డా॥ పట్టాభిగారు అధ్యక్షత వహించిరి.

కామన్‌వెల్తులో భారతదేశ స్థానము విషయమై నేడెట్టి చర్చయు జరుగలేదు.

వింధ్యప్రదేశ్ కాంగ్రెస్ సంఘము

వింధ్యప్రదేశ్ రాష్ట్రీయ కాంగ్రెస్ సంఘమును రద్దుచేయ నేడు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు నిశ్చయించిరి. దాని స్థానే ఒక 'అడ్‌హాక్' కమిటీని నియమింప వలసినదిగా సభవారు అధ్యక్షు మహాశయుని కోరిరి.

ఎన్నికలలో తగవులాటల మూలకముగా ఈ రాష్ట్రీయ కాంగ్రెసుకమిటీ వ్యవహారములు అసంతృప్తికరముగా నుండుటచేత కాంగ్రెసు కార్యవర్గమువారు ఈ నిర్ణయము గావించిరని తెలియుచున్నది.

### మాన్‌భం సత్యాగ్రహము

మాన్‌భం సత్యాగ్రహము గూడ (ఇది బీహారులో ఒక జిల్లా) నేడు సభలో చర్చకువచ్చెను. ఈ విషయము కేంద్ర ప్రభుత్వమునాటి విచారణలో నుండుటచేత ఈ సత్యాగ్రహమును ఆపుచేయ వలసినదిగా కాంగ్రెస్ మహాసభాధ్యక్షుడు సత్యాగ్రహము సాగించుచున్న వారికి వ్రాయవలెనని సభవారు నిర్ణయించిరి.

బీహారు ప్రజారక్షణ చట్టమును దుర్వినియోగము చేయుటను ఆపుచేయవలెనని కోరుచు, మాన్‌భంలో బెంగాలీ మాట్లాడు ప్రజలపై హిందీని అంటగట్టుటకు అసమ్మతి తెలుపుచు, ప్రభుత్వ యంత్రములోను, కాంగ్రెస్ సంస్థలోను అవినీతి ప్రబలియున్నదని చెప్పుచు మాన్‌భమ్ జిల్లా లోకసేవక్ సంఘమువారు ఏప్రిల్ 6 న ఈ సత్యాగ్రహమును ప్రారంభించి యుండిరి.

కాంగ్రెసుకును, దానికి ప్రతిగా స్థాపింపబడిన యితర సంస్థలకును సంబంధములను వర్కింగ్ కమిటీవారు చర్చించిరి. ఈ విషయమును పరిశీలించి కార్యవర్గము వారికి నివేదిక సమర్పించ వలసినదిగా సభవారు కార్యదర్శిని కోరిరి.

### కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు సమావేశం

న్యూఢిల్లీ, ఏప్రిల్ 11: కాంగ్రెసు పార్లమెంటరీబోర్డు నేడు సర్దార్ పటేల్ భవనమున 2 గంటలసేపు సమావేశమై కొన్ని నిర్ణయములు చేసినది.

కాంగ్రెసు సంస్థయొక్క పరిపాలనా విషయములను, నిర్మాణానికి చెందిన విషయములను బోర్డు చర్చించినట్లు అధికారరీత్యా ప్రకటింపబడెను.

తూర్పు పంజాబు కాంగ్రెస్ ఎసెంబ్లీ పార్టీకి నాయకుడుగా క్రొత్తగా ఎన్నికో

### భారత ప్రభుత్వమునకు సంస్థాన ప్రతినిధులకు ఒడంబడిక

#### శ్రీ రామానంద తీర్థగారి సంతసము

హైదరాబాదు, ఏప్రిల్ 11 : సంస్థానముల రాజ్యాంగముల స్వరూపము విషయమై భారత రాజ్యాంగ పరిషత్తువారు భారత రాజ్యాంగములో ఒక మరతు చేర్చుచున్నందుకు నేను సంతసించుచున్నాను. రాష్ట్రముల రాజ్యాంగ విధానములకును సంస్థానముల రాజ్యాంగ విధానములకును భేదములనిది చాలవరకు తగ్గించును' అని శ్రీ రామానంద తీర్థగారు భారత యునైటెడ్ ప్రెస్‌వారితో ముచ్చటించుచు చెప్పిరి.

"ఇండియా ప్రభుత్వమువారికి సంస్థానముల ప్రతినిధులకును ఒక ఒడంబడిక జరిగెనని, ఈ ఒడంబడిక ఫలితముగా సంస్థానముల రాజ్యాంగము భారత రాజ్యాంగములో అంతర్భాగముగా నుండునని వచ్చిన వార్తను వారిదృష్టికి తీసికొనిరాగా స్వామీజీ పైవిధముగా చెప్పిరి. ఇది భారతదేశమును ఏకముగా, అఖండముగా చేయుటకు తోడ్పడునని స్వామీజీ చెప్పెను.

భారత రాజ్యాంగములో యిట్టి యేర్పాటుండవలెనని స్వామీజీ యిటీవల తన ఉపన్యాసములలో తెలుపుచుండెనని జ్ఞాపకము చేయదగును.

### ఎగుమతి సుంకం

పుదుచ్చేరి, ఏప్రిల్ 11: జనపనార, ప్రత్తి, ప్రత్తిబట్టలమీద ఫ్రెంచి ఇండియా ప్రభుత్వం నూటికి 6 వంతుల ఎగుమతి సుంకం విధించింది.

### తిరువాన్కూరు, కొచ్చిన్

రాజకోట, ఏప్రిల్ 11: తిరువాన్కూరు కొచ్చిన్ సంస్థానాల సమైక్యతా సంఘ అధ్యక్షుడుగా భారత సంస్థానశాఖ జాయింటు కార్యదర్శి ఎస్. ఎస్. ఖూచ్ మే 1 వ తేదీనుండీ వ్యవహరించునని నేడిచ్చట తెలియుచున్నది.

### ఆయుర్వేదమే భారత జాతీయ వైద్య విధానం

#### బరోడాలో ఆయుర్వేద విద్యామహాసభ

బరోడా, ఏప్రిల్ 10: బరోడాలో సమావేశమైన ఆయుర్వేద విద్యావిషయక మహాసభకు (నిఖిలభారత శిక్షా సమ్మేళనమునకు) పండిత దుర్గదత్తశాస్త్రి (కాశీ హిందూ విశ్వవిద్యాలయం) అధ్యక్షత వహించిరి. వీరు తమ అధ్యక్షోపన్యాసములో యీ క్రింది ముఖ్య విషయాలు చెప్పిరి. ఆయుర్వేద వైద్యవిధానము ప్రపంచములోని వైద్య విధానములలో కెల్ల పురాతనమైనది. మన భారతదేశములోని గ్రామములందు నూటికి 95 వంతు ప్రజలు ఆయుర్వేద చికిత్సనే కావలెనని కోరుచున్నారు. బస్తీలలో నివసించువారు నూటికి 5 వంతు మాత్రము ఇంగ్లీషు వైద్యము కావలెనని కోరుచున్నారు.

అధునిక ఇంగ్లీషు వైద్య విద్యాలయములు బోధించెడి శరీరశాస్త్రము శల్యతంత్రము రోగనిదాన పద్ధతులు శాస్త్ర చికిత్స మన ఆయుర్వేద వైద్యులు కూడా నేర్చుకోవలెను.

ఆయుర్వేద వైద్యమునే జాతీయ వైద్య విధానముగా ప్రభుత్వము ప్రకటించవలెను. ఆధునిక ఇంగ్లీషు వైద్యశాస్త్రముతో ఆయుర్వేద వైద్యమును సమన్వయించినట్లయితే ప్రపంచములోని వైద్య విద్యకు ఆయుర్వేదము అనేక నూతనవిషయములను బోధించగలదు.

చోప్రా కమిటీ సూచించినట్లుగా వేర్వేరు వైద్యవిధానములను సమన్వయించుట అవసరము.

ఈ సభను ఉపక్రమించుచు డా॥ బార్లింగ్ గారిట్లు చెప్పిరి.

వివిధవైద్య విధానములను చోప్రా కమిటీ సూచించిన విధముగా సమన్వయించుట అవసరము, అనివార్యము కూడాను. ఆధునిక వైద్యశాస్త్ర పద్ధతులను ఆయుర్వేద వైద్యులు నేర్చుకొనవలెను. ఆయుర్వేద వైద్యాన్ని ఉద్ధరించకపోతే పేద జనానికి అందుబాటులో ఉండే చికిత్సలను చేయ సాధ్యంకాదు.

ధనవ్య దురాశలతో ఆయుర్వేద వైద్యులు వైద్యము చేయకూడదు.

# 'హైదరాబాదును ఆంధ్రరాష్ట్ర రాజధానిగా చేయ ఆంధ్రుల వాంఛ'

## శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారి ప్రకటన

హైదరాబాదు, ఏప్రిల్ 10: "హైదరాబాదునందలి వివిధ భాషాప్రాంతములను పరిసరమునున్న ఆయా భాషా రాష్ట్రములలో కలిపివేయవలెనని కోరుచున్నందువలన ఎంత శీఘ్రముగా నిట్లు జరిగిన అంత మేలని తలచుచున్నాను. త్వరలో నేర్పడనున్న ఆంధ్రరాష్ట్రమునకు హైదరాబాదును రాజధానిగా చేసికొనవలెనని మేము ఆతురత జెందుచున్నాము' అని ఢిల్లీనుండి మద్రాసు వెళ్ళుచు యిచ్చట ఒకరోజు ఆగిన శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారు భారత యునైటెడ్ ప్రెస్‌వారితో ప్రసంగించుచు చెప్పిరి.

సంస్థానమునందు శీఘ్రమే నిజమునుగా నిర్మూలించవలెనన్న భూస్వామ్యము రద్దుచేయుటకు, భూమి అమరకపు విధానమును సంస్కరించుటకు దీర్ఘకాల పథకములను చేయవలెనని ప్రజా ప్రతినిధులతో కూడిన ప్రభుత్వమే ఈపని చేయగలదు' అని శ్రీ కాళేశ్వరరావుగారనిరి.

నేటిమధ్యాహ్నము శ్రీ కాళేశ్వరరావుగారు విమానములో మద్రాసుకు బయలుదేరి వెళ్ళిరి. ఈ నెల ఆఖరువారములో వారుతిరిగి హైదరాబాదు వత్తురని తెలియుచున్నది. అప్పుడు వారు నల్లగొండ, వరంగల్ జిల్లాలలో పర్యటించి అచ్చటి పరిస్థితులను స్వయంగా తెలిసికొనెదరు.

హైదరాబాదు, ఏప్రిలు 11: పోలీసు చర్య అనంతరము హైదరాబాదు పత్రికా రచయితల సంఘ ప్రథమ ఎన్నికలు నేడు జరిగెను. లి దౌలత్ అహమ్మద్ గారు (నిజామ్ గజెట్) అధ్యక్షుడుగాను శ్రీ తహిల్ రమణి, అక్తార్ హుస్సేన్ గారలు ఉపాధ్యక్షులుగాను, అల్లాబక్షు(మజ్దూర్) కార్యదర్శిగాను ఎన్నుకొనబడిరి.

బదిన లాలాభీమసేనసచార్ ఢిల్లీలో లేకుంటచే అచటి క్రొత్త మంత్రివర్గ నిర్మాణ విషయమై చర్చలేమీ జరుగలేదనికూడ ప్రకటింపబడెను.

### హైద్రాబాదు భవిష్యత్తుపై తీర్థ-శంకర్రావ్ చర్చలు

హైద్రాబాదు, ఏప్రిల్ 11: హైద్రాబాదు సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షుడు స్వామీ రామానంద తీర్థగారు ఏప్రిల్ 21 వ తేదీ ప్రాంతములో పూనా వెళ్లినప్పుడు అ. భా. కాంగ్రె కార్యదర్శి శంకర్రావ్ దేవ్ గారిని కలుసుకుని సంస్థాన కాంగ్రెసు భవిష్యత్తునుగురించి హైద్రాబాదు భవిష్యత్తు గురించి ఆయనతో చర్చించునని తెలియుచున్నది. సంస్థాన కాంగ్రెసు అధ్యక్షుడు రామానంద తీర్థగారు బీడ్ జిల్లాలో 7 రోజులపాటు పర్యటించడానికి వెళ్తున్నారు. ఈ సందర్భంలోనే వారు పూనాకూడా వెళ్లి వస్తారు.

కమ్యూనిస్టుల ముప్పు, కాందిశీకుల సమస్య, హైద్రాబాదు రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నికలు, వీటిని గురించి కూడా తీర్థగారు శంకర్రావ్ దేవ్‌తో సంప్రతింపులు జరిపెదరు. సంస్థానప్రజలు హైద్రాబాదులో ప్రజాప్రతినిధులతో కూడిన ప్రభుత్వమును నెలకొల్పవలెనని వాంఛించుచున్నారు. ఈ వాంఛ అనుదినమూ బలీయం అవుతున్నదనీ మిలిటరీ ప్రభుత్వములోనైనా ప్రజా ప్రతినిధులను కొంతమందిని చేర్చవలెనని ప్రజలు కోరుచున్నారనీ స్వామీ రామానంద తీర్థగారు కాంగ్రెసు కార్యదర్శికి నివేదించెదరు.

### హైదరాబాదులో గాంధినిధి వారము

హైదరాబాదు, ఏప్రిల్ 11: హైదరాబాదు సంస్థానములో ఏప్రిల్ 23 నుండి 30 వరకు గాంధి జాతీయ స్మారకనిధి వారముగా పరిగణింపబడును. ఈ నిధికి త్వరగా వసూలుచేయుటకు బ్రహ్మాండమైన కృషి చేయవలెనని నిధి హైదరాబాదు శాఖాధ్యక్షుడు స్వామీ రామానంద తీర్థగారు విజ్ఞప్తి చేయుచున్నారు.



Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, G. T. Madras.